

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# పవిత్రకళత్రచరిత్రము.

ఇది

విజయనగరనివాసుఁడైన

వింజమూరి వేంకటనృసింహాచార్యునిచే

రచియింపఁబడినది.



Printed and Published by
B. RAMASWAMI AT THE
**ARSHA PRESS**
VIZAGAPATAM
**1917**

శ్రీమతే రామానుజాయ నమః.

# పవిత్ర కళత్ర చరిత్రము.



కం॥ శ్రీప్రియ నీకిదె మ్రొక్కుచు ।
నా ప్రథమకళత్రచరిత నభివర్ణింతున్ ।
నీప్రీతియుతాలోకం ।
బే ప్రొద్దుమదీయకవితనెనయింపఁగదే ॥౧॥

సీ॥ గంజామునామక ఘనమండలంబందు
నరసన్నపేటను నామమొప్పు ।
తాలూకలోనున్న తలసముద్రంబను
గ్రామరాజమునందు ఘనతమెరయ ।
మాడభూష్యన్వయమహితుడై శ్వేతాద్రి
నాథఘనశ్యామనామమునను ।
శ్రీవైష్ణవాగ్రణి జెన్నారునాయన
పత్ని శేషాంబనా బరగుచుండు ।

గీ॥ నట్టి సద్దంపతులకాదినందననివయి ।
చంద్రనిధిమునిశశిసంఖ్యశకసమాన ।
విభవసమమార్గశీర్షసద్విమలపక్ష ।
నవమి బుట్టితివలమేలునామధేయ ॥౨॥

ఉ॥ పుట్టిన నాటినుండియును భూరివివేకము దైవ
భక్తియున్ । కిట్టనిమాటలాడమియు కీర్తికరంబగుసచ్చరిత్రమున్ । పట్టుగ నీకె చెల్లె నన
భాసిలితీవు మహాత్మురాల నీ । పుట్టినయింటి
కిన్నదము పూనినయింటికిభూషణంబవై ॥౩॥

సీ॥ నీశైశవంబున నీతండ్రిగారు మొ
దటిసారి మాయూరుదారి సింహ ।
గిరికేగుచు మదీయగృహమందు బసచేసి
నాదు మాతామహు నారసింహ ।
గురువరేణ్యునిజూచి గురువర భవదీయ
పుత్రికాపుత్రుడీముద్దుకుర్ర ।
డితనికి నాకన్యనిచ్చెద నెలమితో
మీకు సమ్మతమేని చేకొనుండు ।

గీ ॥ అనుచు నను గూర్చి పల్కి వారరసమొంది ।
రపటినుండియు నామీద నధికరాగ ।
మొదవియుండియు నన్నిపుడొంటిపరచి ।
చనగ నీకెట్లు మనసొప్పె సాధుచరిత ॥౪॥

కం॥ నీ సహవాసవశంబున ।
నా సర్వాఘము గతించె నని చెప్పుటచే ।
నీసుకృతమీదృశంబని ।
యోసతి చెప్పంగవశమె యుర్వీస్థలిలోన్ ॥౫॥

కం॥ నా సత్కర్మవశంబున ।
నో సతి నీవబ్బితంచు నుబ్బుచునుండన్ ।
ఈసువహించిన తెరగున ।
నా సఖ్యము విడిచి చనగ న్యాయమె సాధ్వీ ॥౬॥

సీ ॥ నీదు పాతివ్రత్య నియమంబునకు పర
పురుష వైముఖ్యంబె పరమసాక్షి ।
నీ భూతకారుణ్య నిర్మలబుద్ధికి
దాతృత్వగరిమయే తగినసాక్షి ।

నీదు సద్వైరాగ్యనియతి కెప్పుడు సుఖ
స్థితిబల్కబడు వాక్కి యతులసాటి।
నీదైవభక్తికి నెమ్మనమ్మున జేయు
హరిపదధ్యానమే యధికసాటి।
గీ॥ ఇట్టిసుగుణపుంజంబవై యేపుమీరి।
సర్వవిధముల మన్మనస్సౌఖ్యదాయి।
నివియుమై యొప్పు నీవు నన్నిటులవిడిచి।
పోవ న్యాయమె నీకు నో పుణ్యచరిత ॥౭॥

కం॥ అలమేలనియెడు నామము।
ఇలమేలగు గుణచయమునకిరవగు నీకున్।
లలిగనక పరిమళంబగు।
నలవిమెనీగుణము లెన్న నతివరో నాకున్॥౮॥

కం॥ నాకోరకుంటివి గాకీ।
ప్రాకటసంసారమందు బలితపువాంఛల్।
నీకుం గల్గునె నారీ।
లోకస్తుతిపాత్రశీల లోకపవిత్రా॥౯॥

ఉ॥ నీదువివేకసంపదయు నీదు పవిత్రసువాక్యజాల
మున్। నీదు విరక్తిచర్యయును నీదగు భూత
దయార్ద్రబుద్ధియున్। నీదగు సత్యవాక్య
తయు నీదగు దానపరాయణత్వమున్। వేద
విధిజ్ఞులైవెలయు వేత్తలకైనను గల్గునే చెలీ
॥౧౦॥

కం॥ నామదిని తుష్టిపరచుచు।
ప్రేమతో మీయత్తగారిప్రియశుశ్రూషల్।
శామించిచేయు నీదగు।
కోమలతనువెటకుబోయెకుందరదనరో॥౧౧॥

కం॥ ఇల నిరువదెనిమిదేడులు।
సలలితముగ బ్రతికి నీవు సయ్యన బరమ।
స్థలిజేరితి వకటా నను।
ప్రలయసదృశశోకవార్ధిబడవైచిచెలీ॥౧౨॥

కం॥ నీపుత్రుని దీవింపుము।
నీపుత్రిక కెలమినిమ్ము నెరిమంగళముల్।

కా పురుషా వేద్యుండగు ।
నాపూరుషు గొల్చిపొందు మతిమోదంబున్
॥౧౩॥

కం॥ నీయాత్మకు సుఖమబ్బుత ।
నీయాత్మపరాత్ముగొల్చి నెరిముదమొందున్ ।
నీయాత్మ తైజసంబగు ।
కాయము వేవేగనొంది ఘనరుచినుండున్ ॥
౧౪॥

ఆ॥ వె॥ వింజమూరివంశ్య వేంకటనరసింహు ।
డెలమి జేసెదీని నింపుగులుక ।
భార్యయందుగల్గు పరమవిశ్వాసంబు ।
మదిని దాచలేక మమతతోడ ॥౧౫॥

